# విజ్ఞాన చంద్రికా మండలి

(1860 వ సం॥రము 21 వ నంబరు ఆక్టు ప్రకారము రిజిష్టరుచేయఁబడినది).

1913-వ సంవత్సరాంతము వరకు

## కార్య నివేదనము.





కార్యాలయము

90, స్వామినాయకవీధి, చింతాద్రిపేట, మద్రాసు.

# విజ్ఞాన చంద్రికా మండలి

## ప్రారంభదశ.

1906 సంవత్సర మధ్యమందు 5 గురు ఆంధ్ర యావనులు గుంటూరు పట్టణమున సమావేశమై దేశభాషలగుండ నాత్మదేశపు జనసామాన్యమునకు పాశ్చాత్య పరిజ్ఞానమును వ్యాపింపజేయుటకు సంకల్పించి ఒక మండలిగా నేర్పడిరి. ఈ సంకల్పమును నిర్వహించుటకు 100 పుటలుగల మాస పత్రికను ప్రకటించుట మంచిదా, ఉపయోగకరములగు అనేక విషయములగూర్చి సులభమగు వేర్వేరు కరపత్రములను విరివిగ పంచిపెట్టుట మంచిదా, శాస్త్ర సంబంధమయి నట్టియు చరిత్రాత్మకమయినట్టియు విషయములనుగూర్చి వివరించు పటుతరములగు గ్రంథములనొక్కటొక్కటిగా ప్రకటించుట మంచిదా, అను విషయములను తర్కించి వీనిలో కడపటిపద్ధతి యనుకూలముగ నున్నదనియెంచి తక్షణమే పనికి ప్రారంభించిరి.

ఈ యుద్దేశ్యములను ఆశయములను సూచించుచు నొక చిన్నవ్యాసమును మేము మున్ముందుగా ప్రకటించిన అబ్రహాములింకను చరిత్రయను గ్రంథముయొక్క పీఠికయందు ప్రచురించితిమి. ఇంత కాలముగడచిన పిమ్మట ఆ పీఠిక నిప్పుడు మన మొక్కసారి చూచినయెడల మండలి నిర్మాతలు, దాని భావ్యభ్యుదయము నంతగా నెరింగియుండలేదని బోధపడ గలదు. రావుబహద్దూరు వీరేశలింగం పంతులుగారు దాని

త్రికోణమితి - చూపించినను జీవశాస్త్రము రసాయనశాస్త్రము ఆర్థికశాస్త్రము మొదలగు ఉత్కృష్టశాస్త్ర గ్రంథములను భాషాంతరీకరించుట యెన్నటికైన సాధ్యమగునా యని మన దేశీయులు సంశయించు దినములలో వృత్తి శాస్త్రజ్ఞానము జన సామాన్యమునకు వ్యాపింప జేయవలె నన్న దేశభాషల మూలముననే జేయవలె నని దృష్టాంత పూర్వకముగా నేటికి రుజువు పరచగలిగితిమని సంతసించుచున్నాము.

మండలి ప్రథమ సంవత్సర కార్యవిధానము నంతయు కీర్తిశేషులైన రావిచెట్టు రంగారావు మనసబుదారుగారు హైదరాబాదు మూలస్థానముగా నేర్పరచుకొని దృఢానురాగ దీక్షతో నిర్వహించిరి. మండలియొక్క సంకల్పములతో ఏకీభావమువహించి దానిని జయప్రదముగా జేయుటకు వారుజూపిన అమూల్యభక్తికిని అపారపరిశ్రమకును మేమెంతయు కృతజ్ఞులము.

మండలివారు నాలుగు పుస్తకములు ప్రచురించు సరికి కార్యస్థానము హైదరాబాదులో బెట్టుకొని తమకార్యములను చక్కగ జరగించుట యసాధ్యమయ్యెను. అందుచే 1908 సంవత్సర మధ్యమున కార్యస్థానము చెన్న పట్టణమునకు మార్చబడెను. అప్పటినుండియు పుస్తకముల నిక్కడినుండియే ప్రకటించుచున్నాము. మండలియు దినదినాభి వృద్ధిగాంచుచుండుటచే దానిచరిత్ర నిప్పుడు వ్రాయుటకు వేడుకగానున్నది.

## పుస్తక ప్రకటన.

మండలి పక్షమున నింతవరకు 23 గ్రంథములు వెలువడినవి. 1-వ అనుబంధము చూడనగును. అందు 12 శాస్త్ర

గ్రంథములు, 5 చరిత్రలు, 4 మహాపురుష జీవితములు, 2 చరిత్రాత్మకమగు నవలలు. సాధ్యమైనంతవరకు ఆ యా శాస్త్రములయందు ప్రవీణతగలవారినే గ్రంథనిర్మాణమున కేర్పరచియున్నాము. గ్రంథముల ఆకార వైచిత్ర్యములను నానాఁటికి వృద్ధిచేసితిమి.

మండలి గ్రంథములను చెన్నపురి యూనివర్సిటీవారును, టెక్స్టుబుక్కు కమిటీవారును (Text Book Committee) స్కూలుబుక్కు అండు వర్నాక్యులరు లిటరరీ సొసయిటి (School Book and Vernacular Literary Society) వారును, లోకలుబోర్డులవారును, ఎడ్యూకేషనల్ డిపార్టుమెంటువారును అభిమానించి యథాశక్తి పోషించియున్నారు. ఏయే పుస్తకము ఎన్నిప్రతులు, ఎన్నిసారులు ముద్రితమైనదో తెలియపరచు పట్టీని రెండవ అనుబంధములో చేర్చియున్నాము.

బుక్కుడిపో.

1910 సంవత్సర ప్రారంభమున మండలియొక్క చందాదార్లు 2700 మందియుండి తెలుఁగు భాషయందలి యితర గ్రంథములుగూడ మండలి పుస్తకముల తోపాటు పంపవలసినదని కోరుచు తరుచువ్రాయుచు వచ్చిరి. అందుచే విజ్ఞానచంద్రికా బుక్కుడిపో అనుపేర నితర పుస్తకముల విక్రయమునకై నొక శాఖనేర్పరుపవలసివచ్చెను. మండలియొక్క ప్రధానోద్దేశములకు భంగముకలుగు నేమోయను భయముచేత ఈ శాఖ నంతగా నభివృద్ధిలోనికి తెచ్చుటకు యత్నింపలేదు. అయినను చందాదారులకును గ్రంథకర్తలనేకుల

కును, ఈ బుక్కుడిపో మిగుల యుపకరించినదని వ్రాయుటకు సంతసించుచున్నాము.

## పరిషత్తు.

మండలి మూలముగను ఇతరవిధములను దినదినాభివృద్ధియగుచున్న ఆంధ్రవాఙ్మయ పఠనమును వృద్ధిచేయునుద్దేశముతో 1910-వ సంవత్సరమధ్యమున రావుబహాదూరు కం. వీరేశలింగం పంతులువారు అధ్యక్షులుగా నొకపరీక్షా సంఘమును విజ్ఞానచంద్రికా పరిషత్తను పేరుతో నేర్పరిచియున్నాము. దాని కార్యనిర్వాహకుల యొక్కయు పద్ధతుల యొక్కయు వివరములను మూడవ అనుబంధమున చూడనగును. 1911 సంవత్సరము జూన్ నెల కడపటి వారమునందు తెలుఁగు దేశమునందలి 20 ముఖ్యపట్టణములలో సాహిత్యము, చరిత్ర, శాస్త్రము, అను మూఁడు విషయములలో నిపరీక్ష జరుగునని ప్రచురపరచితిమి. తదాదిగ నేఁటేట అట్టి పరీక్షలను జరుపుచున్నాము. నేఁటివరకు 406 గురువిద్యార్థులను పరీక్షించి అందు కృతార్థులైన 112 గురికి యోగ్యతాపత్రముల నిచ్చియున్నాము. కృతార్థులైనవారి పేర్లను యోగ్యతాపత్రముయొక్క నొక చిన్నప్రతిమను 4-5 అనుబంధములలో నిచ్చియున్నాము. మొదటి సంవత్సరము 430 రూపాయలతో ప్రారంభించి కడపటి సంవత్సరం 516-0-0 లు వెలగల బంగారు పతకములను రొఖపు బహుమానములను ప్రతిసంవత్సరము ఇచ్చియున్నాము. బహుమానము పొందినవార్ల పేర్లను బహుమానము లిచ్చినవార్ల పేర్లను 6 వ అనుబంధములో చేర్చియున్నాము. వరుసగ రెండు సంవత్సరముల

యందు (1912-1913) స్త్రీలే హెచ్చు బహుమానములను పతకములను సంపాదించియుండుటయే, విద్యాభిరుచి వారి కీపరీక్షలచే హెచ్చినదనుటకు నిదర్శనము. ఈపరీక్షలను జరుపుటయందు మాకు మిక్కిలి సహాకారులైన పరీక్షకులకు మేము మిక్కిలి కృతజ్ఞులము. వారినామములను ఏడవ అనుబంధములో నిచ్చియున్నాము. వారిసహాయములేనిది మేమీపని నెంతమాత్రము నిర్వహించియుండమని చెప్పకతప్పదు. పరిషత్పరీక్షా పత్రముల 14-వ అనుబంధములో నిచ్చియున్నాము.

బహుమతినవల.

దేశభాషల నభ్యసించుట యందును, దేశభాషల యందు గ్రంథములను రచించుటయందును, ఈమధ్య నొక విధమైన యుత్సాహము పుట్టియున్నది. ఇట్టి యుత్సాహమును పెంపొందించుటకై ఆంధ్రదేశమునకు సంబంధించిన యేదైన నొకకథనుగైకొని నవలను వ్రాయువారలలో నుత్తమునికి మేము రు. 500 లు బహుమాన మిచ్చెదమని 1912 సంవత్సరములో ప్రకటించియున్నాము. ఆ ప్రకటనానుసారముగ 10 నవలలు మా కార్యస్థానమునకు చేరినవి. అందొకటి గడువుదాటిన తరువాత వచ్చినందున నిరాకరించితిమి. మిగత 9 నవలలపరీక్షించుటకై నొక కమిటీని నేర్పరిచితిమి. ఆకమిటీ వారేకాభిప్రాయముగ కృష్ణాజిల్లా అంగలూరి కాపురస్థుడు మ-రా-రా-శ్రీ, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు రచించిన విజయనగర సామ్రాజ్యము అను నవలకు అగ్రస్థానమొసంగిరి.

కావునన బహుమతిమొత్తము రూ. 500 లును వారి కొసంగుటకు మిగుల సంతసించుచున్నాము. ఇదిగాక "విజయసింహ" యను నామాంతరముగల రాయచూరు యుద్ధమును, అస్తమయము, శ్రీమణి, పాతాళభైరవి, అను నాలుగు నవలలుకూడ గణనీయములని కమిటీవా రభిప్రాయ పడియున్నారు. అత్యుత్సాహముతో శ్రమలకోర్చి నవలలను పంపిన లేఖకులను ఈసందర్భమున మిగుల ప్రశంసించుచున్నాము. ఈ పరీక్షకు శ్రీమతిముడుంబి రంగనాయకమ్మ గారు రాయదుర్గమునుండి ఒక చక్కని నవలను పంపినందులకు మేమెంతయు సంతసించుచున్నాము.

రాబోవు బహుమతిపరీక్షకుకూడ వీరందరును పట్టుదలతో విడువక కృషిచేసి జయమును పొందుటకు ప్రయత్నింతురని తలంచుచున్నాము.

## రిజష్ట్రేషను.

మండలి కార్యములు నానాటికి ప్రబలి శాఖలధికమై ఆయా శాఖలయందలి పనులును వృద్ధియగుచువచ్చెను. మండలిని శాశ్వతముగా నుండులాగు చేయ నిశ్చయించి 1860 సం॥ రము 21-వ నంబరు ఆక్టుప్రకారము 'సాహిత్య సంఘము' గాని దీని 'మండలి' 1913-వ సంవత్సరము మార్చి 15 వ తేదిని రిజష్టరుచేసి యున్నాము. (అనుబంధము 8).

## ఆదాయవ్యయములు.

మునగాల పరగణా జమీందారు లగు మహారాజ రాజశ్రీ రాజానాయని వేంకటరంగారావు బహదూరువారు

ప్రీతిపూర్వకముగ నొసంగిన రు 1000-0-0 లతో పనిని ప్రారంభించితిమి. 1907-వ సంవత్సరము మొదలుకొని 1913 వ సంవత్సరాంతమువరకు కాదాయపు మొత్తము రు 54,379-9-1. వ్యయపు మొత్తము 53,575-10-3. లు. 1913-వ సంవత్సరాంతమున నిలవ 803-14-10 లు.

ఆదాయవ్యయ వివరములును, ఆస్తివివరమును, లాభనష్టముల పట్టికయు అనుబంధములలో గాననగును. ఇప్పటివరకు మండలియాస్తి రు 7812-11-3 లుగానున్నట్టు తెలియుచున్నది. (9,10,11,12,13 అనుబంధములు చూడుము.)

ఆదాయపు మొత్తములో రు 4172-7-0 లు విరాళముల రూపకముగావచ్చినవి. ఈదాతలందరకును, అందుముఖ్యము బొబ్బిలి మహారాజాగారికిని, పిఠాపురము రాజాగారికిని, మునగాల రాజాగారికిని, ఉయ్యూరు రాజాగారికిని, పిఠాపుర రాణీగారికిని, మాకృతజ్ఞతను మనఃపూర్వకముగ నిచ్చుట సూచించుచున్నాము.

ప్రతిఫలము నపేక్షింపకయె మండలికి గ్రంథములు వ్రాసియిచ్చిన గ్రంథకర్తలందరకును మాకృతజ్ఞతను సూచింపక ఈవిషయమును ముగింపజాలము. సకాలమునందట్లు వారు సాయపడకుండినచో మండలియిట్లు వృద్ధిలోనికి రాకపోయియుండును.

మండలి యనుకరణము.

మండలి స్థాపనానంతరము నిరువదింటికిపైగా నితర సంఘము లాంధ్రదేశము నందివే యుద్దేశములతో స్థాపితము

లయ్యెనని తెలుపగలుగుటకు సంతసించుచున్నాము. ఈ సంఘములేగాక పలువురు గ్రంథకర్తలుగూడ గ్రంథములు వ్రాసితమంతట తాము ప్రకటించుచున్నారు. మాతృభాషను శృంగారింపగడంగి మాతోపనిజేయు నీ భాషాభిమానుల కందరకును మేము మనఃపూర్వకముగ స్వాగతమొసంగు చున్నాము.

ఈ సందర్భమున మాలోకొందరు ఆంధ్రవిజ్ఞానసర్వస్వ మును ప్రకటింపఁబూనిరని తెలుపుటకు సంతసించుచున్నాము. కార్యభారము మిక్కుటము; అనుకూలమోకొద్ది. అయినను అభిలాషమెండు. కాఁబట్టి విద్యాభిమాను లందరును ఈయుద్య మమునకుఁదోడ్పడి జయప్రదము గావింతురుగాక !

ఆంధ్రవాచక ప్రపంచమును, ఆంధ్రరాజ చంద్రు లును, విజ్ఞానచంద్రికామండలికి తమ పోషకత్వమును ప్రసా దించెదరుగాక ! విజ్ఞానచంద్రికామండలి నానాఁటికి వృద్ధిచెంది యనేకగ్రంథ కుసుమములతో ఆచంద్రార్కము నాంధ్ర భాషామతల్లిని పూజించుచు దేశసేవఁజేయును గాక ! !

చెన్నపట్టణము.
12—4—14.

బ. నరసింహేశ్వరశర్మ.
ఆ. లక్ష్మీపతి.
అ. కాశేశ్వరరావు.
కే. వి. లక్ష్మణరావు.
వే. విశ్వనాథశర్మ.
గా. రామచంద్రరావు.
తా. వేంకట్రామయ్య.

Dowden & Co., Madras.

## విషయానుసారముగ విభజింపబడిన ప్రకటితగ్రంథములపట్టిక.

ప్రకృతిశాస్త్రములు:— గ్రంథకర్త.

1. జీవశాస్త్రములు. ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.
2. పదార్థవిజ్ఞానశాస్త్రము. ఎమ్. సాంబశివరావు, బి. ఏ. ఎల్. టి.
3. రసాయనశాస్త్రము. వే. విశ్వనాథశర్మ. ఎం. ఏ. ఎల్. టి.
4. కలరా. ఆ. లక్ష్మీపతి. బి. ఏ. ఎం. బి. సి. ఎం.
5. జంతుశాస్త్రము. కే. శీతారామయ్య బి. ఏ. ఎల్. టి.
6. వృక్షశాస్త్రము. కే. శీతారామయ్య బి. ఏ. ఎల్. టి.
7. శారీరశాస్త్రము,ఆరోగ్యబోధిని. కే. శీతారామయ్య బి. ఏ. ఎల్. టి.
8. భౌతికశాస్త్రములప్రథమపాఠములు. కే. శీతారామయ్య బి.ఏ.ఎల్.టి.
9. భౌతికశాస్త్రము. ఎమ్. నరసింహము, బి. ఏ. బి. ఎల్. ఎల్. టి.
10. చలిజ్వరము. ఆ. లక్ష్మీపతి బి. ఏ. బి. ఏ. ఎం. బి. సి. ఎం.
11. అర్థశాస్త్రము. క. రామలింగారెడ్డి ఎం. ఎ.
12. వ్యవసాయశాస్త్రము. 1వ భాగము. గోటేటి. జోగిరాజు.

చరిత్రలు:—

1. హిందూమహాయుగము. కే. వి. లక్ష్మణరావు. ఎం. ఏ.
2. మహమ్మదీయ మహాయుగము. కే. వి. లక్ష్మణరావు. ఎం.ఏ.
3. ఆంధ్రులచరిత్రము 1-వ భా. చిలుకూరి. వీరభద్రరావు.
4. ఢిల్లీదర్బారు. గా. హరిసర్వోత్తమరావు. ఎం. ఏ.
5. ఆంధ్రులచరిత్రము 2-వ భా. చిలుకూరి వీరభద్రరావు. ఎం. ఏ.

జీవితములు:—

1. అబ్రహాములింకను. గా. హరిసర్వోత్తమరావు. బి. ఏ.
2. స్వీయచరిత్ర రావుబహదూరు వీరేశలింగముగారు.
3. చంద్రగుప్తచరిత్ర. విద్యారణ్యపరమహంస, బి. ఏ.
4. మహాపురుషుల జీవితచరిత్రములు. వ. శ్రీనివాసరావు, బి. ఏ.

నవలలు:—

1. రాణీసంయుక్త. వేలాల. సుబ్బారావు.
2. విమలాదేవి. భో. నారాయణమూర్తి.

## అనుబంధము 2.

### ప్రకటితగ్రంథములు, కూర్పులు, ప్రతులు.

| సంవత్సరం. | నెంబరు | పేరు. | కూర్పులు | ప్రతులు. |
|---|---|---|---|---|
| 1907 | 1 | అబ్రహాములింకను. | 2 | 3000 |
| | 2 | హిందూమహాయుగము. | 5 | 5000 |
| | 3 | జీవశాస్త్రము. | 2 | 3000 |
| 1908 | 4 | రాణీసంయుక్త. | 2 | 4000 |
| | 5 | మహమ్మదీయమహాయుగము. | 2 | 4000 |
| 1909 | 6 | పదార్థవిజ్ఞానశాస్త్రము. | 1 | 3000 |
| | 7 | రసాయనశాస్త్రము. | 2 | 4000 |
| 1910 | 8 | ఆంధ్రులచరిత్రము 1-వ భా. | 1 | 3000 |
| | 9 | విమలాదేవి. | 2 | 4000 |
| | 10 | కలరా. | 2 | 4000 |
| | 11 | జంతుశాస్త్రము. | 3 | 9000 |
| | 12 | వృక్షశాస్త్రము. | 3 | 9000 |
| | 13 | శారీరశాస్త్రము. ఆరోగ్యశాస్త్రము. | 3 | 9000 |
| | 14 | భౌతికశాస్త్ర ప్రథమపాఠములు. | 3 | 9000 |
| 1911 | 15 | రా. బ. క. వీరేశలింగముగారి స్వీయచరిత్రము. | 1 | 3000 |
| | 16 | భౌతికశాస్త్రము. | 1 | 3000 |
| 1912 | 17 | ఢిల్లీదర్బారు. | 1 | 3000 |
| | 18 | ఆంధ్రులచరిత్రము 2-వ భా. | 1 | 4000 |
| | 19 | చంద్రగుప్త చక్రవర్తి. | 1 | 3000 |
| | 20 | చలిజ్వరము. | 1 | 3000 |
| 1913 | 21 | అర్థశాస్త్రము. | 1 | 5000 |
| | 22 | మహాపురుషుల జీవితచరిత్రములు. | 1 | 3000 |
| | 23 | వ్యవసాయశాస్త్రము 1-వ భా. | 1 | 4000 |

అనుబంధము ౩.

# విజ్ఞానచంద్రికాపరిషత్తు.

ఈ పరిషత్తు విజ్ఞానచంద్రికా మండలి వారిచే 3 సంవత్సరము. కొకసారి యేర్పరుపఁబడును. ఇందు ఒక అధ్యక్షుఁడును, ఒక ఉపాధ్యక్షుఁడును, 7 గురు సభాసదులును ఉందురు.

సభాసదులలో నలుగురు విజ్ఞానచంద్రికాసభాసదులుగా నుండవలెను. మండలి సభాసదులలో నొక్కరు దీనికి కార్యదర్శిగా నుండవలెను. మొదటి ౩-సంవత్సరములలో ఈక్రింద నుదహరించినవారు పరిషత్తునకు సభాసదులు.

అధ్యక్షుఁడు.

మ-రా-రా రావుబహదూరు కం-వీరేశలింగము పంతులుగారు, రాజమహేంద్రవరము.

ఉపాధ్యక్షుఁడు.

మ-రా-రా వావిలికొలను సుబ్బారావుపంతులుగారు చెన్నపట్టణము

సభాసదులు.

మ-రా-రా-క. రామలింగారెడ్డిగారు, ఎం.ఏ., మైసూరు.
,, కే. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ., మునగాల.
,, ఆ. లక్ష్మీపతిగారు బి. ఏ., ఎం. బి., సి.ఎం., చెన్నపట్టణము
,, అ. కాశేశ్వరరావుగారు, బి. ఏ, బి. ఎల్. బెజవాడ.
,, పి. శ్రీనివాసాచార్యులుగారు, బి. ఎ. బి. ఎల్. చెన్నపట్టణము.
,, చి. వీరభద్రరావుగారు చెన్నపట్టణము.
,, వి. వి. శర్మగారు ఎం. ఏ., కార్యదర్శి; చెన్నపట్టణము.

పరిషత్సభ 1913-వ సంవత్సరములో తిరిగిమార్చబడినది. ఇప్పుడీప్రకారముగా సభాసదులుగలరు.

## అధ్యక్షుఁడు.

మ-రా-రా రావుబహదూరు కం. వీరేశలింగము పంతులుగారు రాజమండ్రి.

## ఉపాధ్యక్షుఁడు.

,, చెన్నాప్రగడ భానుమూర్తిగారు, బి.ఏ.,ఎల్.టి. చెన్నపట్టణము.

## సభాసదులు.

మ-రా-రా క. రామలింగారెడ్డిగారు, ఎం ఏ, మైసూరు.
,, కే. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ, మునగాల.
,, ఆ. లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి. సి. ఎం. చెన్నపట్టణము.
,, అ. కాళేశ్వరరావుగారు, బి. ఎ., బి.ఎల్. బెజవాడ.
,, జి. వేంకటరంగారావుగారు, ఎం. ఏ.,
,, చి. వీరభద్రరావుగారు, రాజమండ్రి.
,, వి. వి. శర్మగారు, ఎం. ఏ., ఎల్. టి. కార్యదర్శి.

## I. సంకల్పము.

ఇంగ్లీషు తెలియని ఆంధ్రజనులకు సాహిత్యమునందును దేశచరిత్రములందును ప్రకృతి శాస్త్రములందును జ్ఞానాభివృద్ధిచేయుట ఈ పరిషత్తుయొక్క ముఖ్యోద్దేశము.

## II. పరీక్షలు.

ఇందుకొఱకు ప్రతిసంవత్సరము ఈదిగువ నుదహరించిన ప్రకారము పరీక్షలు జరుపఁబడును. అట్టిపరీక్షలో తేరినవారలకు విలువగల బహుమతులిచ్చి **గౌరవింతుము.**

## III. పరీక్షార్థులు.

మెట్రిక్యులేషను పరీక్షగాని, స్కూలుఫైనలు పరీక్షగాని, వీనితో సమానమైనట్టిగాని, అధికమైనట్టిగాని ఏవిధమయిన పరీక్షలను ఇచ్చియుండని

జనులందరును జాతిమతభేదముగాని, స్త్రీపురుషవివక్షతగాని లేక ఈ పరీక్షకు రావచ్చును.

## IV. పరీక్షవిషయములు.

1. సాహిత్యము; ఛందోవ్యాకరణములఁగూర్చి పరీక్షార్థులకుఁగల జ్ఞానమును పరీక్షించు సులభప్రశ్నలు సాహిత్యభాగమునం దుండును.

2. చరిత్ర, మహాపురుషుల జీవితములు.

3. ప్రకృతి శాస్త్రములు అనఁగా పదార్థ విజ్ఞానము, శాయనశాస్త్రజ్ఞాన శాస్త్రము, జంతుశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, వృక్షశాస్త్రము, మొదలగునవి ఈమూఁడు విషయములును పరీక్షకు నవసరములే, ఒక్కభాగమును తీసికొన వీలులేదు.

## V. పరీక్షావిధానములు.

పైనుదహరించిన విషయములలో ప్రతి సం||రం జూలై నెల కడపటి శనివారమున పరీక్షలు జరుపఁబడును. రెండుగంటల కాలములో వ్రాయఁదగిన ప్రశ్న పత్రములు మూఁడుండును.

## VI. పరీక్షస్థలములు.

1. బరంపురం.
2. విజయనగరం.
3. విశాఖపట్టణం.
4. రాజమహేంద్రవరం.
5. కాకినాడ.
6. గుంటూరు.
7. మచిలీపట్టణము.
8. ఒంగోలు.
9. నెల్లూరు.
10. కడప.
11. బళ్లారి.
12. పెనుకొండ.
13. చిత్తూరు.
14. నర్సాపురం.
15. ఏలూరు.
16. హైదరాబాదు.
17. బెజవాడ.
18. కర్నూలు.
19. చెన్నపట్టణము.
20. రంగూను.
21. పెద్దాపురము.
22. హనుమకొండ.
23. బెంగుళూరు.

ఈ పట్టణములు పరీక్షాస్థలములుగా ఏర్పరుపఁబడినవి. అనఁగా పరీక్షార్థు లెక్కడివారైనను పరీక్షనిమిత్తము ఈ స్థలములలో తమ యిష్టము వచ్చినచోటికి రావచ్చును. పై సుదహరింపఁబడని మరి యేపట్టణమునుండియైనను 20 మంది విద్యార్థులు పరీక్షకు దరఖాస్తుచేయునెడల ఆపట్టణమే పరీక్షాస్థలముగా నియమింపఁబడును. ఏజిల్లానుండియైనను ఈ పరీక్షకు 20 కంటె ఎక్కువ దరఖాస్తులు చేరునెడల ఆజిల్లాయొక్క ముఖ్యపట్టణము పరీక్షాస్థలముగా నేర్పరుపఁబడును. పైఁజెప్పబడిన 23 పట్టణములుగాక ఇతర పట్టణములు ఏవిఅయినను పరీక్షాస్థలములుగా నేర్పరుపఁబడినయెడల మే నెల 15 తేదిలోగా పత్రికలమూలమున తెలియపరచెదము.

పరీక్షాస్థలములు మార్చుకొనఁ దలఁచువారు మాకు జూన్ నెల 15-వ తేది లోపుగఁ దెలియచేయవలెను.

## VII. యోగ్యతాపత్రములు.

ప్రతిప్రశ్న పత్రమునందు నూటికి ముప్పదిగుణములకు తక్కువలేకుండ సంపాదించువారు ఈ పరీక్షయందు కృతార్థులయిన ట్లెంచఁబడుదురు. నూటికి 30 గుణములు మొదలు 60 గుణములవఱకు సంపాదించువారు రెండవ తరగతిలోఁ గృతార్థులయి నట్లెంచఁబడుదురు. 60 గుణములును (marks) అంతకంటె ఎక్కువగుణములను సంపాదించువారు మొదటితరగతులలో కృతార్థులయిన ట్లెంచఁబడుదురు. కృతార్థులయిన పరీక్షార్థుల కందఱకు యోగ్యతాపత్రము లొసఁగఁబడును.

## VIII. దరఖాస్తులు.

పరీక్షకు రాగోరువార లందరును దరఖాస్తునమూనాను పూర్తిచేసి అందుతో 8 అణాలు పోస్టేజిచీట్లు దరఖాస్తు రుసుముక్రింద పంపవలెను. లేదా ఈరుసుమును మనీఅర్డరుద్వారా పంపవచ్చును. దరఖాస్తు రుసుమును ఒక్కమారేపంపవలెను. అదియొకసారి ఇదియొకసారి పంపినయెడల దరఖాస్తు రిజ

స్టరు కాకపోవచ్చును. దరఖాస్తులు ప్రతి సం||రం జూన్ నెల మొదటితేది లోగా మా కార్యస్థానమునకు చేరవలెను. తమ దరఖాస్తులు అందినవని తెలిసికొనగోరువారు కార్డొకార్డు తమ అడ్రస్సు వ్రాసి దరఖాస్తుతోబాటు పంపవలెను.

## 1914-వ సంవత్సరము జూలైలోజరుగు పరీక్షయొక్క పఠనీయగ్రంథములు.

### I. సాహిత్యము.

1. ఆంధ్రమహాభారతము, విరాటపర్వము, మొదటియాశ్వాసము, కథారంభమునుండి 141 పద్యములు.
2. సౌందర్యతిలక (పూర్తిగా.)

### II. చరిత్ర.

1. ఆంధ్రులచరిత్రము (రెండవభాగము) 5, 6, 9, 11, 12, 13, 14, ప్రకరణములు.
2. అబలాసచ్చరిత్ర రత్నమాల, మొదటిభాగము. క్రొత్తమూఁడవకూర్పు 99 పుటలు.

### III. ప్రకృతిశాస్త్రము.

1. భౌతిక భూగోళశాస్త్రము 18 ప్రకరణములు 150 పుటలు.
2. చలిజ్వరము (పూర్తిగా.)

వ.రా:—ఇదివరకు జరిగిన పరీక్షలలో రు. 116–0–0 ల బహుమానమును పొందినవారు తిరిగి పరీక్షకురాగూడదు. ఆ మొదటి బహుమానముగాక మిగత యే బహుమానమునైనను ఇదివరకు జరిగినపరీక్షలలో గైకొన్నవారు సదరు రు. 116–0–0 ల బహుమానమునకై మాత్రము ప్రయత్నించవచ్చును.

(బహుమానముల వివరమునకును, పరీక్షాపత్రములకును అనుబంధములు 6-14 చూడుడు.)

## అనుబంధము 4.

## కృతార్థులైన విద్యార్థులు.

## 1911.

1. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యము.
2. నేలటూరు వెంకటరమణయ్య.
3. నల్లాన్ చక్రవర్తి కంఠీరవాచార్లు
4. సత్యరాజు వీరవెంకట దీక్షితులు.
5. కొత్తూరి వెంకటశాస్త్రి.
6. మహంకాళి చినవీరభద్రయ్య.
7. బి. గురురాజారావు.
8. గోటేటి విస్సంరాజు.
9. మాడభూషి చూడమ్మ.
10. అవసరాల వెంకటరావు.
11. డబ్బీరు నారాయణమూర్తి.
12. ప్రతివాది భయంకరం కృష్ణమాచార్యులు.
13. వారణాసి లక్ష్మీనరసింహం.
14. స్థానీకం సుబ్రహ్మణ్యదీక్షితులు
15. ఎడవల్లి శివరామయ్య.
16. కె. చినపురుషోత్తం.
17. మిత్తిపాటి వెంకటసుబ్బారావు
18. మానవరం యజ్ఞనారాయణ.
19. కప్పగంతుల శ్రీరామశాస్త్రి.
20. అయితరాజు జీడికంటి రామారావు.
21. బాలాంత్రపు శేషమ్మ.
22. ఆచంటవిశ్వనాథము.
23. గంగవరపు వెంకటరమణయ్య.
24. అంబటి తవితన్న.
25. గుండవరపు భీమరావు.
26. సహస్రాద్రి వెంకట నరసింహమూర్తి.
27. కే. వరదాచార్యులు.
28. వుల్లాభొట్ల వెంకటసుబ్బారాయుడు.
29. గురుజాడ రామలింగేశ్వరరావు.
30. ఇ. హనుమంతప్ప.
31. ప్రతివాదిభయంకరం గోపాల కృష్ణమాచార్లు.
32. గడ్డంటి గోకరణం.
33. నాదుపల్లి బుచ్చి వెంకటసుబ్బమ్మ.
34. కొమరగిరి వెంకటరావు.
35. మంత్రి రామమూర్తి.
36. పెదప్రోలు రామన్న.
37. బక్కి నరసింహం.

# 1912.

1. కే. కనకమ్మ.
2. కర్రివరాహనరసింహం.
3. సేనపాటిసీతారామమూర్తి.
4. అద్దుర్తిభాస్కరమ్మ.
5. ఇనుగంటి ప్రకాశరావు.
6. చిట్టెం. చిదంబరస్వామి.
7. పాతూరుసుబ్రామయ్య.
8. యం. నరసింహాచార్లు.
9. సేలం కృష్ణరావు.
10. మల్లాది వెంకటసుబ్బారావు.
11. జొన్నలగడ్డసుబ్బయ్య.
12. పెరిశేల వెంకటకొండయ్య.
13. ఈడిగుంట సత్యనారాయణ మూర్తి.
14. కొడాలి శివరామకృష్ణరావు.
15. మానవరం యజ్ఞనారాయణ.
16. పైనంపాటి హనుమంతరావు.
17. గాడిచెర్ల రామమూర్తి.
18. కొలిల్లసత్యనారాయణ.
19. వై. రంగనాయకమ్మ.
20. విన్నకోట మాధవరావు.
21. యం. వివేకానందమూర్తి.
22. తురగా లక్ష్మినారాయణ.
23. అడవిబాపిరాజు.
24. గంగిసెట్టి సుబ్బయ్యశెట్టి.
25. దామెర్ల వెంకటసుబ్రహ్మణ్యము.
26. వి. నరసింగరావు.
27. తేకుమల్ల వెంకోజిరావు.
28. ఆమంచెర్ల శేషాచలపతిరావు.
29. నిడుమోలు సీతారామమ్మ.
30. లంకా వెంకటరామశాస్త్రి.
31. చుండూరు వెంకటరెడ్డి.
32. సిక్కా జగన్నాథం.
33. పున్నమరాజు బంగారమ్మ.
34. రత్నాకరం ఆంజనేయులు.
35. కళ్లేపల్లి వెంకటరమనామ్మ.
36. వనం వెంకటనరసింహారావు.
37. కె. పి. ఏసుదాసు.
38. పి. వెంకటసుబ్బారాయుడు.
39. కోటమంటి సీతారామమూర్తి.
40. పుత్స రాజరాజేశ్వరమ్మ.
41. వడ్లమూడి వెంకన్న.
42. సి. లక్ష్మీకాంతరావు.
43. పిల్లారుసెట్టి లక్ష్మీకాంతమ్మ.
44. అవసరాల వెంకటనరసమ్మ.
45. గరిమెళ్ల లక్ష్మీనరసింహం.
46. ములగలేటి సీతారామయ్య.
47. పరవస్తు రామాబాయమ్మ.
48. నడింపల్లి వెంకటరత్నం.
49. పుప్పాలూరి రామేశం.

# 1913.

1. ఆదుర్తి భాస్కరమ్మ.
2. చిట్టెంచిదంబరస్వామి.
3. కందికొండ వీరభద్రయ్య.
4. చేవలి వెంకటపున్నయ్య.
5. పువ్వల శ్రీమన్నారాయణ.
6. ఇనుగంటి ప్రకాశరావు.
7. కోప్పోలు రంగయ్య.
8. దుర్వాసుల కృష్ణమూర్తి.
9. దాములూరి రామమూర్తి.
19. దామెర్ల వెంకటసుబ్రహ్మణ్యం.
11. వారణాసి లక్ష్మీనరసింహం.
12. చెల్లూరి విశ్వపతిశాస్త్రి.
13. వింజమూరి వెంకటరత్నమ్మ.
14. భమిడిపాటి సుబ్బారావు.
15. భమిడిపాటి చిన్నయజ్ఞ నా రాయణశర్మ.
16. నిడుమోలు సీతారామమ్మ.
17. కొల్లి సత్యనారాయణ.
18. గుండు శేషయ్యశర్మ.
19. గాదె సర్వాత్మపతి.
20. వేమూరి లక్ష్మీనరసింహము.
22. ఆముదాలపల్లి వీరవెంకయ్య.
22. పమ్మెన వెంకటప్పయ్య.
23. యెలకంటి కృష్ణమూర్తి.
24. నడింపల్లి వెంకటరత్నం.
25. క్రొవ్విడి శేష వెంకటకాశీపతి.
26. హర్కార గుండురావు.

విజ్ఞాన చంద్రికా పరిషత్తు



యోగ్యతా పత్రము

పరిషత్తు చేత నియమింపఁబడిన పరీక్షకులచే ౧౯____వ సంవత్సరము________నెలలో సక్రమముగ జరుపఁబడిన పరీక్షలో శ్రీ...............................................గారు ...వ తరగతిలోఁ గృతార్థులయిరని విజ్ఞానచంద్రికాపరిషత్సభాసదులమగు మేమిందు మూలముగ నిర్ణయించుచున్నారము.

పరిషత్తు ముద్రతో నిచ్చిన యోగ్యతా పత్రము.

చెన్నపట్టణము.




అధ్యక్షుఁడు

ది.__________౧౯____

కార్యదర్శి.

# అనుబంధము 6.

## బహుమానములనుపొందిన పరిషద్విద్యార్థులు.

| బహుమతి. | ఎందుకుగాను. | దాత. | ప్రతిగృహీత. 1911. | 1912. | 1913. |
|---|---|---|---|---|---|
| రు. 116-0-0 | అంతరిలో నుత్తమునకు. | విజ్ఞానచంద్రికా మండలి, | పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి | కె. కనకమ్మ. | అదుర్తి భాస్కరమ్మ. |
| 50-0-0 | ఉపాధ్యాయుల బహుమానము. | ,, | కొత్తూరి వేంకటశాస్త్రి. | ,, | చిట్టెం చిదంబరస్వామి. |
| 50-0-0 | మునసబు కరణముల బహుమానము, | ,, | గోటేటిపిస్సంరాజు | ననం వేంకటనరసింహారావు. | భమిడిపాటి చినయజ్ఞ నారాయణశర్మ |
| బంగారుపతకము. | సాహిత్యములో మొదటివారు. | నెమలి పట్టాభిరామరావుగారు | నేలటూరి వేంకటరమణయ్య. | కె. కనకమ్మ. | ... |
| ,, | చరిత్రలో మొదటివారు. | శ్రీ మునగాల రాజాగారు. | పెండ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రి. | కె. కనకమ్మ. | కందికొండ వీరభద్రయ్య. |
| ,, | ప్రకృతిశాస్త్రములో మొదటివారు. | శ్రీ పానుగంటి రామారాయనింగారు. | బా. గురురాజారావు. | కె. కనకమ్మ. | ... |
| పతకము. | అనంతపురము జిల్లాలోని మొదటి వారికి | అనంతపురము జిల్లా కాంగ్రెసుకమిటీ. | ,, | ఆర్. ఆంజనేయులు | ... |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 100-0-0 | స్త్రీలలో ఉత్తమురాలికి. | శ్రీ పిఠాపుర రాణీగారు. | మాడభూషి చూడమ్మ. | కె. కనకమ్మ. | ఆదుర్తి భాస్కరమ్మ. |
| బంగారుపతకము. | సాహిత్యములో మొదటియామెకు. | శ్రీ ఉయ్యూరు రాజాగారు. | ... | ,, | ,, |
| ,, | చరిత్రలో మొదటియామెకు. | ,, | ... | ,, | ,, |
| ,, | ప్రకృతిశాస్త్రములో మొదటియామెకు. | ,, | ... | ,, | ,, |
| ,, | విశాఖపట్టణము విద్యార్థినులలో మొదటియామెకు. | శ్రీమతి ఆర్. వి. రత్నమ్మగారు. | ... | పున్నమరాజు బంగారమ్మ. | ... |
| ,, | గంజాము విద్యార్థినులలో మొదటియామెకు. | ఆర్. గున్నయ్యశాస్త్రిగారు. | ... | పరవస్తు రామాబాయమ్మ. | ... |
| ,, | ద్వితీయునికి. | కె. చంద్రారెడ్డిగారు | ... | ... | చిట్టెం చిదంబరస్వామి. |

## అనుబంధము. 7

## పరిషత్పరీక్షాధికారులు.

### బరంపురము.

డబ్ల్యు. వి. వి. బి. రామలింగం. బి. ఏ. ఎల్. టి. గారు.
ఎ. రామచంద్రరావు, బి. ఏ. ఎల్. టి. గారు.

### విజయనగరము.

C. H. నరసింహారావు, ఎం. ఏ. గారు.
బు. శేషగిరిరావు, ఎం. ఏ. గారు.
బుర్రా బుచ్చమ్మగారు.

### విశాఖపట్టణము.

పులిగడ్డ సత్యనారాయణ, బి. ఏ. బి. ఎల్. గారు.
ఎమ్. కామయ్య, బి. ఏ. ఎల్. టి. గారు.
దామెర్ల శేషమ్మగారు.

### రాజమండ్రి.

ఎమ్. శీతారామరావు, బి. ఏ. ఎల్. టి. గారు
ఐ. గంగన్న, బి. ఏ. ఎల్. టి. గారు.

### కాకినాడ.

డి. వి. ఎస్. ప్రకాశరావు, బి. ఏ. గారు.
పి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

### గుంటూరు.

ఏకా. రామయ్యగారు.
కొండా. వెంకటప్పయ్య, బి. ఏ. బి. ఎల్. గారు.

## మచిలీపట్టణము.

భో. పట్టాభిశీతారామయ్య, బి. ఏ. ఎం. బి. సి. ఎం. గారు.
ఎమ్. సాంబశివరావు, బి. ఏ. ఎల్. టి. గారు.
తా. వేంకట్రామయ్య, బి. ఏ. ఎల్. టి. గారు.

## ఒంగోలు.

ఎమ్. నరసింహము, బి. ఏ. బి. ఎల్. ఎల్. టి.
ఎమ్. ఎస్. శాస్త్రిగారు.

## నెల్లూరు.

ఏ. సంతానరామఅయ్యంగారు. బి. ఏ. ఎల్. టిగారు.
వై. గోపాలకృష్ణయ్యగారు.
వి. వేదవల్లిఅమ్మాళ్ గారు.

## కడప.

సి. రామయ్య, బి. ఏ. ఎల్. టి. గారు.
జి. రామేశ్వరరావు, బి. ఏ. బి. ఎల్. గారు.

## బళ్లారి.

ఏ. భీమాచారి, బి. ఏ. ఎల్. టి. గారు.
కె. బ్రహ్మన్నశాస్త్రిగారు.

## పెనుకొండ.

ఎచ్. శంకరరావుగారు.
టి. శివశంకరంగారు.

## చిత్తూరు.

ఎచ్. సుబ్బారావుగారు.
వి. రత్నసభాపతయ్య, బి. ఏ. బి. ఎల్. గారు.
పి. శీతాపతయ్యగారు.

## నర్సాపురము.

పి. ఎల్. నారాయణగారు.

ఎన్. కోదండరామస్వామి, బి. ఏ. గారు.
పోడూరి. లక్ష్మీనరసింహముగారు.

## ఏలూరు.

వి. గోపాలకృష్ణయ్యగారు.
డి. శివరామమూర్తిగారు.

## అవనిగడ్డ.

వేమూరి శ్రీరాములుగారు.

## బెజవాడ.

ఏ. కాశీశ్వరరావు, బి. ఏ. బి. ఎల్. గారు.
పి. వీరయ్య, బి. ఏ. బి. ఎల్. గారు.

## హైదరాబాదు.

సయ్యదు జహూరుఆలీ, బి. ఏ. గారు.
న. జానకిరామయ్యగారు.

## హనుమకొండ.

మాడపాటి హనుమంతరావుగారు.
ఎచ్. సుబ్బారావుగారు.

## బెంగళూరు.

సి. వేంకటవరదయ్యంగారు.

## కర్నూలు.

టి. ఆర్. శ్రీనివాసమూర్తి. బి. ఏ. ఎల్. టి. గారు.

## పెద్దాపురము.

జె. రామచంద్రరావుగారు.
ఆర్. వి. ఆర్. జగపతిరాజుగారు.

## మద్రాసు.

ఆ. లక్ష్మీపతి. బి. ఏ. ఎం. బి. సి. ఎం. గారు.

# అనుబంధము. 8

(సరియైన నకలు)

## సర్టిఫికేటు ఆఫ్ ఇంకార్పొరేషను.

1912-13 యొక్క 20-వ నంబరు.

సాహిత్య, శాస్త్రీయ, ధార్మిక సంఘముల రిజష్టరిచేయుటకై ఇండియాగవర్నరు జనరల్ ఇన్ కౌన్సిలుగారి 1860-వ సంవత్సరము 21-వ శాసనముప్రకారము విజ్ఞానచంద్రికా మండలియట్టి యాక్టుకు సంబంధించిన సంఘముగా రిజష్టరిచేయబడినదని ఇందుమూలముగా ధృవపర్చుచున్నాను.

మద్రాసు, 15-3-1913.

(దస్కతు) వి. సుబ్బారావు.
రిజస్ట్రారుఆఫ్ జాయంటుస్టాకు కంపెనీస్.

రిజష్ట్రారుగారి ఆఫీసు ముద్రయున్నది.

# అనుబంధము 9.

## ఆదాయము.

| సంవత్సరము. | పుస్తకముల అమ్మకము. | | | విరాళములు. | | | అడ్వాన్సులు (రావలసినవి). | | | చిల్లర. | | | మొత్తము. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Rs. | A. | P. | Rs. | A. | P. | Rs. | A. | P. | Rs. | A. | P. | Rs. | A. | P. |
| 1907 ... ... | 838 | 8 | 0 | 1,000 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 1,838 | 8 | 0 |
| 1908 ... ... | 1,856 | 4 | 0 | 190 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 2,046 | 4 | 0 |
| 1909 ... ... | 5,595 | 9 | 6 | 1,000 | 0 | 0 | 3 | 0 | 0 | 5 | 1 | 0 | 6,603 | 10 | 6 |
| 1910 ... ... | 9,011 | 2 | 2 | 1,100 | 0 | 0 | 619 | 9 | 6 | 62 | 5 | 0 | 10,793 | 0 | 8 |
| 1911 ... ... | 7,943 | 0 | 3 | 0 | 0 | 0 | 2,640 | 11 | 3 | 58 | 7 | 0 | 10,642 | 2 | 6 |
| 1912 ... ... | 10,130 | 6 | 3 | 500 | 0 | 0 | 1,032 | 9 | 6 | 28 | 5 | 5 | 11,691 | 5 | 2 |
| 1913 ... ... | 9,105 | 9 | 3 | 382 | 7 | 0 | 1,213 | 6 | 6 | 63 | 3 | 6 | 10,764 | 10 | 3 |
| మొత్తము ... | 44,480 | 7 | 5 | 4,172 | 7 | 0 | 5,509 | 4 | 9 | 217 | 5 | 11 | 54,379 | 9 | 1 |

# అనుబంధము 11.

## 1913-వ సంవత్సరములోని ఆదాయవ్యయ పట్టిక.

| ఆదాయములు. | మొత్తము. | | | వ్యయము. | మొత్తము. | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | కాగితములు ... | 1,523 | 0 | 0 |
| పుస్తకములయమ్మకము | 9,105 | 9 | 3 | అచ్చుకూలి ... | 979 | 2 | 0 |
| | | | | బైండింగు ... | 1,060 | 10 | 6 |
| అడ్వాన్సులు ... | 1,213 | 6 | 6 | పటములు ... | 145 | 10 | 6 |
| విరాళములు ... | 382 | 7 | 0 | గ్రంథకర్తలకు ప్రతిఫలము ... | 486 | 3 | 0 |
| | | | | బహుమానము ... | 536 | 4 | 0 |
| చిల్లర ఆదాయము... | 63 | 3 | 6 | పోస్టేజి, ప్యాకింగు | 1,709 | 9 | 5 |
| మొత్తము జమా ... | 10764 | 10 | 3 | అమ్మకమునకైకొన్న పుస్తకములు ... | 1,561 | 6 | 11 |
| | | | | ప్రకటనలు ... | 50 | 9 | 0 |
| సంవత్సరాదిని నిలవ. | 388 | 4 | 8 | సామాను ... | 99 | 3 | 0 |
| | | | | జీతములు ... | 926 | 7 | 6 |
| | | | | అడ్వాన్సులు రావలసినవి ... | 904 | 8 | 9 |
| | | | | చిల్లర, బండికూలి, కలముశిరావగయిరా... | 366 | 5 | 6 |
| | | | | మొత్తము ఖర్చులు... | 10349 | 0 | 1 |
| | | | | సంవత్సరాంతమున నిలవ ... | 803 | 14 | 10 |
| మొత్తము ... | 11152 | 14 | 11 | మొత్తము ... | 11152 | 14 | 11 |

డిసెంబరు 31-వ తేదితో అంత్యమగు 1913-వ సంవత్సరపు పైయాదాయ వ్యయపట్టికను నేనుపరీక్షించినాను. సరిగానున్నది.

మద్రాసు
15-1-1914.

(దస్కతు) జి. నరసింహముఎల్.ఏ.ఏ.ఎఫ్.సి.ఐ.
అసోసియేటెడు అక్కౌంటెంటు (లండన్.)

అనుబం

1913-వ సంవత్సరపు

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| సంవత్సరాదిని నిలువయుండు పుస్తకములు ... ... | 5427 | 3 | 11 |
| కాగితములు, అచ్చు, బైండింగు, పటములు, గ్రంథకర్తలకర్చు | 3542 | 3 | 3 |
| | 8969 | 7 | 2 |
| ఆదాయము ... ... ... ... | 3888 | 14 | 1 |
| | 12858 | 5 | 3 |
| పోస్టేజి, ప్యాకింగు ఖర్చు ... ... ... | 1699 | 1 | 11 |
| బహుమానములు ... ... ... ... | 536 | 4 | 0 |
| ప్రకటనలు ... ... ... ... | 50 | 9 | 0 |
| జీతములు ... ... ... ... | 926 | 7 | 6 |
| చిల్లరకర్చులు ... ... ... ... | 366 | 5 | 6 |
| సామానుల అరుగుదల బా॥ ... ... ... | 29 | 8 | 9 |
| పుస్తకభాండాగారముల అరుగుదల బా॥ ... ... | 22 | 0 | 0 |
| పటముల దిమ్మెలపై అరుగుదల బా॥ ... ... | 225 | 0 | 0 |
| సంవత్సరాంతమున లాభము ... ... ... | 479 | 3 | 11 |
| | 4334 | 8 | 7 |

ధ ము 12.

లాభనష్టముల పట్టిక.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| అమ్మకము బా॥ జమ. ... ... ... | | 9105 | 9 | 3 |
| 31-12-13 తేదిననిలువయున్న బా॥ | | | | |
| మండలి గ్రంథములు కమీషన్ పోస్టేజీకై | | | | |
| 50° మినహాయింపు కాగా ... | 3400-10-0 | | | |
| కొనినపుస్తకములు ... ... | 107-9-0 | | | |
| అచ్చగుచున్న పుస్తకములు ... | 244-9-0 | 3752 | 12 | 0 |
| | | 12858 | 5 | 3 |
| ఆదాయము ... ... ... ... | | 3888 | 14 | 1 |
| విరాళములు ... ... ... ... | | 382 | 7 | 0 |
| చిల్లరజమలు ... ... ... ... | | 63 | 3 | 6 |
| | | 4334 | 8 | 7 |

అనుబం

అప్పులను, ఆస్తిని

| అప్పులు. | మొత్తము. | | |
|---|---|---|---|
| | రూ. | అ. | పై. |
| చిల్లర అప్పులు ... ... ... ... | 609 | 5 | 11 |
| కమీషనుమీద అమ్మటకుగాను తెచ్చినపుస్తకములకు ఇయ్య వలసినది ... ... ... ... | 3491 | 13 | 9 |
| | 4101 | 3 | 8 |
| నిలవ ఆస్తి ... | 7812 | 11 | 3 |
| | 11913 | 14 | 11 |

డిసెంబరునెల 31-వ తేదితో అంత్యమగు 1913-వ సంవత్సరము

స్థానం. మండలియొక్క నిజస్థితి నీపట్టిక తెలుపుచున్నదని నాయభి

(వస్కతు.) జి. నరసింహాము, ఎల్. ఏ. ఏ. ఏ. సి. ఆర్. ఏ.

అసోసియేటెడు అక్కౌంటెంటు. (లండన్.)

ధ ము 13.

తెలియజేయు పట్టిక.

| ఆస్తి. | మొత్తము. | | | మొత్తము. | | |
|---|---|---|---|---|---|---|
| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
| నిలవసొమ్ము ... ... ... | 803 | 14 | 10 | | | |
| మద్రాసు బ్యాంకులో డిపాజిట్టు ... | 1081 | 13 | 3 | | | |
| పత్రముమీద బదులునూటికి 12°/₀ చొ॥ | 774 | 0 | 0 | 2659 | 12 | 1 |
| చిల్లరబాకీలు ... ... | | | | 1070 | 14 | 10 |
| పోస్టేజి కమీషనుక్రింద 50°/₀ మినహా యింపుపోను పుస్తకములవెల ... | 3752 | 12 | 0 | | | |
| సామాను అరుగుదల బా॥ 10°/₀ మిన హాయింపు ... ... | 265 | 15 | 3 | | | |
| పుస్తకభాండాగారము అరుగుదల బా॥ 10°/₀ మినహాయింపు ... | 197 | 11 | 0 | | | |
| పటముల దిమ్మెలు అరుగుదల బా॥ 25°/₀ మినహాయింపు ... ... | 675 | 0 | 0 | 4891 | 6 | 3 |
| కమీషనుమీద అమ్మకమునకుగాను తెచ్చిన పుస్తకముల వెల. ... ... | | | | 3491 | 13 | 9 |
| | | | | 11913 | 14 | 11 |

యొక్క మండలి గ్రంథములను పరీక్షించిపై పట్టికను తయారుచేసియు ప్రాయము.

(దస్కతు) ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.

మేనేజరు.

## అనుబంధము. 14.

# విజ్ఞానచంద్రికాపరిషత్తు.

బహుమతిపరీక్షా ప్రశ్నములు.

**1911**

### 1. సాహిత్యము.

గజేంద్రమోక్షము.

(పి. శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ. బి. ఎల్.)

I. (a) పరీక్షితుం డేవంశమువాఁడు? అతఁ డేల ప్రాయోపవిష్టుం డయ్యె?

(b) గజేంద్ర గ్రాహముల పూర్వజన్మ వృత్తాంతములం దెలుపుఁడు.

(c) ప్రబలమైన విష్ణుభక్తి చెడదు—మఱి యేది చెడును? ఎట్లు?

II. తన వేంచేయుపదంబుఁ బేర్కొనఁ డనాథస్త్రీజనాలాపముల్
వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో ఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులన్
గనిచక్రాయుధుఁ డేడిచూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్.

ఇందుసూచితములగు కథలను వ్రాయునది.

III. (a) అధ్యాత్మయోగము, అపవర్గము, ఏకాంతులు, క్షేత్రజ్ఞుఁడు— వీనియర్థముల విశదీకరించునది.

(b) నిష్ఠితబ్రహ్మపదావలంబనగతిన్ గ్రీడించు యోగీంద్రు మర్యాదను వర్ణించునది.

(c) వేదండము, శుండాలము, మార్తాండుఁడు—వీని వ్యుత్పత్తులు దెలుపునది.

IV. (a) అంధకార మెల్ల నద్రి గుహాంతర
వీధులందుఁబగలు వెరచి డాఁగి
యెడరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న
వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు.
దీనికి ప్రతిపదార్థము వ్రాయునది.

(b) జనమును జలమును బలమును
వివిధములుగఁ బోరు కరటి వీరతకు భువిన్
దివి మకర మీన కర్కట
నివహము లోక్కటన మిత్రనిలయముఁ బొందెన్.
దీని తాత్పర్యము వ్రాయునది.

(c) విబుధుఁడు, గుణము, ఇనుఁడు, దానము—ఈ పదములకు నానార్థములు వ్రాయునది.

V. (a) బోటికి నందిచ్చు నిందు బోటుఁదనమునన్, గాలి పాటిన మాత్రాన జాలిఁ బొందు—క్రిందగీట్లుపెట్టబడిన భాగములందలి వ్యాకరణ విశేషంబుల నెఱింగించునది.

(b) IV (b) లోని పద్యమునఁ గర్త బహువచనముగ నుండఁ గ్రియ యేక వచనముగనుండుట తప్పా ? ససూత్రముగ వ్రాయునది.

(c) విష్ణుపంచాయుధంబు లెయ్యవి ?

VI. వృత్తజాత్యుపజాతులకుం గల భేదము లెఱింగించి 11-వ ప్రశ్న లోని పద్యమును IV(b) ప్రశ్నలోని పద్యమును వీనిలో నెందుఁజేరునో తెలుపునది.

## 2 చరిత్ర.

### హిందూమహాయుగము.

### ఈశ్వర చంద్రవిద్యాసాగరుని చరిత్రము.

(చెన్నాప్రగడ భానుమూర్తిగారు, బి. ఏ. ఎల్. టి.)

N. B. — చరిత్రాంశముల వివరించునప్పుడెల్ల, అందలి కాలమును వ్రాయుఁడు.

I. సుదాసుఁడు, కుత్సుఁడు, వీరినిగురించి మీకుఁ దెలిసినది సంగ్రహముగా వ్రాయుఁడు.

II. సూత్రయుగమునందుగల రాజ్యవ్యవస్థ విషయము సంగ్రహముగా వ్రాయుఁడు.

III. జైనసిద్ధాంతమును సంగ్రహముగా వివరింపుఁడు.

IV. (1) చంద్రగుప్తుఁడు.
(2) సముద్రగుప్తుఁడు.
(3) విక్రమాదిత్యుఁడు.
(4) ప్రతాపరుద్రుఁడు.

వీరినిగురించి, ఒక్కొక్కని విషయము ఒక్కొక్కపుటకు మించకుండ, వ్రాయుఁడు.

V. బౌద్ధాచార్యుల పరిషత్తు లే యే కాలములలో, ఏ యే రాజుల సత్కారమువలన జరిగినది తెలుపుఁడు.

VI. ఈశ్వరచంద్ర విద్యాసాగరులవారి సుగుణముల వేర్వేర నిరూపించి, ఒక్కొక్క సుగుణమునకు వారి చరిత్రనుండి నిదర్శనముగా నొక్కొక్క యంశమును వివరించునది.

VII. సంఘసంస్కరణ విషయమున, మీరుచేసిన పరిశ్రమను సంగ్రహముగా రెండుపుటలకు మించకుండ వ్రాయుఁడు.

## 3. శాస్త్రము.

### పదార్థవిజ్ఞానశాస్త్రము—కలరా.

(ఆ. లక్ష్మీపతిగారు, బి. ఏ. ఎం. బి. సి. ఎం.)

I. భౌతిక మార్పునకును రాసాయనిక మార్పునకును గల ముఖ్యభేదమును తెలుపుచు ప్రతిదానికి రెండేసి ఉదాహరణము లిమ్ము.

II. సకలపదార్థములకు సామాన్యమైన ధర్మములను అయిదింటిని పేర్కొని వానిని ఉదాహరణములతో విశదీకరించునది.

III. (1) గురుత్వాకర్షణము అననేమి?

(2) అణ్వాకర్షణము సృష్టియందు లేదనుకొనిన యెడల గలుగు నష్టము లెవ్వి?

(3) ఆశ్లేషయను శక్తి యెట్టిదో తెలియపరచుటకు రెండు ఉదాహరణములిమ్ము.

IV. సున్నితమైన త్రాసున కుండవలసిన లక్షణములను మూడింటిని పేర్కొనుము.

(లేక)

భారమితియొక్క ప్రయోజనములను మూడింటిని పేర్కొనుము.

V. (1) చిమ్మనగొట్టముయొక్క రచనను చూపుపటమును వ్రాయుము.

(2) నీరు గొట్టములోని కెక్కునప్పుడు గలుగు మార్పులన్నిటిని వివరింపుము.

(3) చిమ్మనగొట్టమునకును కిరసనాయిల్ డబ్బాలోని నూనెను వె
లుపలికి తీయు నిమిత్త ముపయోగించు బొంబాయికిని గల
భేదమేమి ?

VI. కలరావలన మైలపడిన నీటిని శుద్ధిచేయు విధానములను మూటిని
పేర్కొని అందు సులభమైన దెద్దియో వ్రాయుము.

VII. (a) కలరాయొక్క వ్యాపకమునకు గాలి యెంతవరకు సహాయప
డును ? దోమలెంతవరకు సహాయపడును ?

(b) కలరావ్యాధికి "పుణ్యక్షేత్రములు విత్తనపు గంపలు" దీని
భావమును వివరింపుము.

## 1912.

## 1. సాహిత్యము.

రుక్మిణీకల్యాణము—విమలాదేవి.

(గా. హరిసర్వోత్తమ రావుగారు, ఎం ఏ.)

I. పోతనామాత్యుఁ డేమండలమువాఁడు ? అతఁడు భాగవతమును ఎవరి
కంకితముచేసెను ? అతని పద్యములలో మీకుఁదోచిన గుణము
లెవ్వి ?

II. ఈ క్రింది పద్యమునకుఁ బ్రతిపదార్థము వ్రాయునది:—
కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావల
గ్నునవాంభోజదళాక్షుఁజారుతరవక్షున్ మేఘసంకాశదే
హునగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిఁబీతాంబరున్
ఘనభూషాన్వితుఁగంబుకంఠువిజయోత్కంఠున్ జగన్మోహనున్

III. విమలాదేవి రాజసింహునకును రుక్మిణీదేవి కృష్ణునకును వ్రాసిన జాబులయందలి విషయముల యొక్క ఔచిత్యానౌచిత్యములను సందర్భంబులఁబట్టి చర్చింపుఁడు.

IV. (a) ఈ క్రిందిరూపములెట్లు సిద్ధించునో వివరింపుఁడు. 1. జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ 2. చదువుసెప్పు 3. భూవరును వింటికాదె 4. త్వమేవగతియనియె.

(b) అవ్యయములకును ఇతర పదములకును భేదమేమి? ఉదాహరణములతో నిరూపింపుఁడు.

(c) (i) "మూడు మనుష్యులు సరసము మాటలు మాటలాడు కొంటుఁ యీదారేగిరి"; (ii) "గోవిందుకుఁ బుస్తకము లిచ్చిక్కడికి వచ్చితిని" (iii) "వాఁడు చేయితో నాకాలుమీఁదఁ గొట్టినాఁడు".—ఈవాక్యములలోఁగల లోపములను సకారణంబుగ సవరింపుఁడు.

V. (a) మీరుచదివినవనలయందు విమలాదేవిగాక ఇతరులలో మీకు ముఖ్యతనుమనితోఁచిన పాత్రమును సంక్షిప్తముగ వర్ణించునది. (b) ఆ పాత్రము నెన్నుకొనుటకు మీకారణముల వ్రాయునది.

VI. (1) "ఖగనాథుం డమరేంద్రుఁ గెల్చి సుధముగ్ గైకొన్న చందంబునన్"

(2) "అతఁడు (వైకుంఠయోగి) 'నారదుఁడో?' లేక 'తుంబురుఁడో?' యని తలఁపక మానరు".

(3) "ఆ బ్రాహ్మణుఁ డాభటులకు మఱియొక రూపాయి ఇచ్చి లోనికిఁ బోయి భక్తి పరవశుఁడయి యాడుచుఁబాడు చున్న...ను జూచి భక్తితో నమస్కరించి "మహాత్మా! నీవంటి భగవద్భక్తునకుఁగూడ కర్మఫల మనుభవింపక తప్ప లేదుగదా" యని చింతించెను.—ఈ మూఁడు వాక్యముల గర్భిత మగు కథలనుసంక్షిప్తముగ వ్రాయుఁడు.

VII. ఈ క్రిందివానిని మీ స్వంతవాక్యములలో నిమిడ్చి ప్రయోగింపుఁడు:— i. సింహముపాలిసొమ్ము గోమాయువు గోరు చందమున ii. మ్రానుఁ ద్రచ్చి ననవహ్ని శిఖా నడిఁ దెమ్ముకై నడిశా. iii. ముందున్నది ముసళ్ల పండుగ.

## 2. చరిత్రము.

### మహమ్మదీయ మహాయుగము—మహాపురుషుల జీవితములు.

(క. రామలింగా రెడ్డిగారు ఎం. ఏ.)

జాగ్రత్త:—ప్రథమభాగములోని ప్రశ్నలకెల్లను ప్రత్యుత్తరము లొసంగ యత్నింపవలయు. ద్వితీయభాగములో నేవైన నాలుగుప్రశ్నల మాత్రము సాధింపఁ జూడనగును.

### —ప్రథమభాగము.—

I. i మహమ్మదీయులు హిందువుల నోడించునంతటి బలముగలవారగుట కును

ii హిందువులు మహమ్మదీయులచే నోడింపఁబడునంత దుర్బలు లగుట కును కారణము లెవ్వి?

II. "మన ప్రాచీనమతమందు నిజమైన భక్తిగలవారును, మతమున నూతన ములైన మార్పులు చేయవలయునని నిజమైన భక్తిగలవారును, ఈ

యిరు పక్షములవారును హిందువులయొక్క సంఘమున సంస్కారములు చేయవలయుట యావశ్యకమనుటలో నేకీభవించియున్నా రు. పట్టిమాటలు వేషములతోఁబని జరుపుకొను కపటులుమాత్రము సంఘసంస్కారమన్న వెఱచి దూరముగఁబోదురు." అని యొకానొకరు అభిప్రాయపడిరి. ఈ యభిప్రాయము తగినదా, తగనిదాయనుట కేశవ చంద్రసేనులయు వివేకానందస్వాముల యుఁ జరిత్రములఁ బట్టి చర్చింపుఁడు.

## —— ద్వితీయభాగము.——

(ఏవైన నాలుగు ప్రశ్నల కుత్తరము వ్రాయుఁడు).

I. రాజారామమోహనరాయలు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, దేవేంద్రనాధ టాగూరులు, వీరలచే బోధింపఁబడిన i. మత సంస్కారములును, ii సంఘసంస్కారములును బేర్కొనుఁడు.

II. బ్రహ్మ సమాజపుఁజరిత్రము వ్రాయుఁడు.

III. ఈక్రిందఁబేర్కొనఁ బడినవారిచే తురుష్క రాజ్య మే యే వృద్ధులఁ జెందెనో వివరింపుఁడు:——

i. మహమ్మదుగోరి. ii అల్లాయుద్దీన్ కిల్జీ. iii ఫిరోజిషా. షర్ హాసూర్.

IV. మొగలాయీలకును రాజపుత్రులకును బాబరు దివసములనుండి ఔరంగజేబు మరణపర్యంతము జరిగిన సంబంధాసంబంధము లెవ్వి?

V. మీచదివిన భాగములో అద్భుత చరిత్రలని మీకుఁదోచిన స్త్రీల నలుగురిఁబేర్కొని వారి చరిత్రముల వ్రాయుఁడు.

VI. అక్బరు, ఔరంగజేబు ఈ మహాపాదుషాలకుఁ గల i. సంఘమతధర్మముల యందలియు ii. రాజనీతి యందలియు భేదములను, తత్ఫలములను విశదీకరింపుఁడు.

VII. మొగలాయీల కాలములో హిందూదేశము మొత్తముమీఁద నేస్థితి యందుండెనని చరిత్రకారుల యభిప్రాయము?

VIII. మొగలాయీల కాలములో సంఘమతాది సంస్కారముల బోధించినవారిలో ముఖ్యులెవ్వరు? వారి బోధనలలోని ముఖ్యాంశము లెవ్వి?

## 3. శాస్త్రము.

### రసాయనశాస్త్రము—ఆరోగ్యశాస్త్రము.

(డి. పట్టాభిసీతారామయ్యగారు, బి. ఏ. ఎం. బి. సి. ఎం.)

☞ రసాయనశాస్త్రమున నేనాల్గు ప్రశ్నలకైన నుత్తరము వ్రాయునది. అన్నిటిం బ్రయత్నింపవలదు.

### రసాయనశాస్త్రము.

I. భౌతికవికారమునకును రసాయనవికారమునకును భేదమును నుదాహరణములతోఁ దెలియఁజేయుఁడు.

II. రసాయనసమ్మేళనమునకును సామాన్యమిశ్రణమునకును భేదమేమి? సామాన్య మిశ్రణమునందుండు పదార్థములను విడదీయు సులభమార్గములను జెప్పుఁడు.

III. మనము పీల్చుగాలియందు ముఖ్యమైన వాయువులెవ్వి? వానియొక్క కూడికయెట్టిది? ఆ కూడికను గనుఁగొనుటకొక్క ప్రయోగమును వర్ణింపుఁడు.

IV. ధాతువులకును ఉపధాతువులకును భేదమేమి? ఈ క్రిందివానియందు ధాతువులను ఉపధాతువులను వేరుజేయుఁడు. 1 స్ఫురము. 2 సోడియము, 3 యశదము, 4 తైలము, 5 గంధకము.

V. ఈ క్రింది సందర్భములలో నేమి సంభవించునో వివరముగ వ్రాయుఁడు. 1 సోడియపారదమేళనమును నీటిలో వేసినప్పుడు, 2 ఇనుప ముక్కను మైలతుత్తపు ద్రావకమునందు పడవేసినప్పుడు, 3 రససిందూరమును బాగుగఁగాచినప్పుడు, 4 కాల్చిన సున్నపురాళ్లపై చల్లని నీరుఁబోసినప్పుడు, 5 రాతిబొగ్గును గాలితగులకుండ నుడకబెట్టినప్పుడు.

VI. ఖటికజలమన నెట్టిది? ఖటికత్వ మెన్నివిధములు? ఆ ఖటికత్వమును దొలఁగించు టెట్లు?

## ఆరోగ్యశాస్త్రము.

I. వాయుప్రచార మన నేమి? మన ఇండ్లలో నిది ఎట్లు గల్పింపఁబడుచున్నది? శీతల దేశములకును, ఉష్ణదేశములకును గృహములలోని వాయు ప్రచారమునకుఁ జేయు సాధనములను గూర్చి ఎట్టి భేదములు గలవు? తలుపులకు రవాకు ఉండుట యావశ్యకమా? కారణములను సవిస్తరముగ నుడువుఁడు.

II. కొన్ని కాలములలో కాలువనీటిని, మఱి కొన్ని కాలములలో నూతినీటిని మనము వాడుచుందుము. ఇట్టి నీటిని గృహములోని వివిధకార్యములకు వాడునపుడు, ఆయా కార్యముల కాయానీటి నుపయోగించుటయం దుండెడి తారతమ్యములను హేతువులతో తెలియఁ జెప్పుఁడు. సామాన్య గృహములలో నీటిని త్రాగుటకుఁగాను ఏ విధము లగు సాధనములచే పరిశుద్ధము చేయవలెనో వివరింపుఁడు.

# 1913.

## 1. సాహిత్యము.

### శ్రీరామచరిత్రము—వసుమతీవసంతము.

(జి. వి. రంగారావుగారు, ఎం. ఏ.)

I. (1) ధాత్రిల రజమున దేవ
వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్
జాతులుగా నొనరించు గు
ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా.

(2) దైతేయ ప్రమదాపరీత నతిభీతన్ గ్రంథిబంధాలక
వ్రాతన్ విశ్వసనానిలాశ్రుకణ జీవంజీవదారామ భూ
జాతన్ శుష్కకపోల కీలితకరాబ్జాతన్ బ్రభూతన్ కృశీ
భూతన్ బ్రాణసమేతసీతఁ గనియెన్ భూమీశుఁ డాముందటన్.

(a) పై మొదటి పద్యమునకు తాత్పర్యమును రెండవదానికి ప్రతి పదార్థమును వ్రాయునది.

(b) రెండవ పద్యములోని యలంకారములను చెప్పి లక్ష్యలక్షణ సమన్వయము సేయునది.

(c) మొదటి పద్యమునందలి "గుణాతీతుఁడవు" "గుణగణాలంకార" అను విశేషణంబుల సమన్వయించునది.

II. (a) పసిడిఱ్ఱియై నటించు
నీచుమారీచు రాముఁడు నెఱివధించె,

ఇందలి 'నెఱి' శబ్దమున కర్థమేమి? అది యే కథావిశేషమును సూచించుచున్నది?

(b) లీలం రామవిభుం డొక
కోలం గూలంగనేసె గురునయశాలిన్

II. విజయనగర చరిత్రమును గురించి (1) తురకలు (2) విదేశీయులు—వ్రాసిన వ్రాత లెంతవఱకు విశ్వసనీయములు? మీ యభిప్రాయమును స్థిరపఱచుటకు మూఁడుదాహరణముల నిచ్చునది.

III. తురకలతో యుద్ధము గావించుట తప్ప, దేశహితార్థమై మరి యేయే సత్కార్యములు యేయే రాజపుత్ర విజయనగరరాజులచే గావింపఁబడినవో, వివరింపుఁడు.

IV. హిందువులకును మహమ్మదీయులకును జరిగిన యుద్ధములకును, ఈ యుద్ధములలో హిందువులకు గలిగిన జయమునకును, అపజయమునకును, గలకారణముల నుదాహరణ సహితముగ, నిరూపించునది.

V. స్వయంసహాయ మన నేమి? "ఏకార్యము సాధించుటకును నిరంతర ప్రయోగమును పట్టుదలయు నావశ్యకములు" అను సత్యమును దెలుపు మహాపురుషుని చరిత్ర నొకదానిని వ్రాయునది.

VI. బెర్నార్డ్ పాలిస్సి, జాను ఫ్రిడెరిక్ బోట్గర్, అను వారిలో నొకని చరిత్రమును వ్రాసి, దానివలన గ్రహింపఁదగిన సత్యముల విశదీకరింపుఁడు.

VII. హమీర్, సంగరాణా, ప్రతాపసింహుఁడు,—ఈ ముగ్గురు ఉదయపుర రాజ్యాభివృద్ధికై చేసిన ప్రయత్నములను, వీనివలన వీరు పొందిన ఫలములను, సంగ్రహముగ వ్రాయుఁడు.

VIII. విజయనగర సామ్రాజ్య మాదియందు స్థాపింపఁబడిన క్రమమును, 15 వ శతాబ్దమునం దానగరముగాంచిన వైభవమును, పూర్తిగ వివరించునది.

IX. కృష్ణదేవరాయని చరిత్రమును సంగ్రహముగ వ్రాసి, యేయే విషయములయం దితఁడు రాజసింహుని పోలియున్నవాఁడో తెల్పుఁడు.

## 3. శాస్త్రము.

### ఆరోగ్యశాస్త్రము—భౌతిక భూగోళము.

(ఎమ్. సాంబశివరావుగారు బి. ఏ., ఎల్. టి.)

I. 'భారమితి' యంత్రముయొక్క స్వరూప నిర్మాణములను గూర్చియు, దాని యుపయోగముల గూర్చియు విపులముగా వ్రాయుడు.

II. భూమారుతము, సముద్రమారుతము లనునవేవి? వానియొక్క యుత్పత్తి కారణములను సంగ్రహముగాఁ దెలుపునది.

III. నదు లెట్లు పుట్టుచున్నవి? మనదేశమునందలి నదులలో 'డెల్టా' లుగల వానిని మూఁటిని జెప్పి, వాని యుత్పత్తిస్థానమునుండి గమ్యస్థానమువఱకు వర్ణించునది.

IV. నీ వొక చిన్నగ్రామోద్యోగి వైనయెడల, నీ గ్రామముయొక్క ఆరోగ్యమును వృద్ధిచేయుటకు ముఖ్యముగా నేవిషయములగూర్చి యాలోచించి, ఎట్లు ప్రయత్నములుచేయుదువో మిక్కిలి సంగ్రహముగా సూచింపుము.

V. మనము పుచ్చుకొను ఆహారమునందలి భాగము లెవ్వి? అందు క్రొవ్వు పదార్థముల యుపయోగ మేమి?

## (దరఖాస్తు ఫారము)

విజ్ఞానచంద్రికా మేనేజరుగారికి, చింతాద్రిపేట, మద్రాసు.

అయ్యా,

విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో మొదటినుండియు, లేక, ఇప్పటి నుండియు గ్రంథములనుగొను శాశ్వతపుచందాదారుగా నన్ను జేర్చుకొని పుస్తకములను బంపగోరుచున్నాను. ప్రవేశరుసుము 0-4-0 లు లేక రు 1-0-0 వి.పి. ద్వారా రాబట్టుకొనుఁడు.

పేరు (పూర్తిగా)..........................................

హోదా..........................................

గ్రామము..........................................

పోస్టు.......................... జిల్లా..........................

### గమనించుఁడు !

1. ఇదివరకు ప్రచురించిన గ్రంథములను, ముందుప్రచురించువానిని గొనువారు 0-4-0 లు మాత్రమే ప్రవేశరుసుము మీయవలెను.

2. నాలుగణాలు ప్రవేశరుసుమిచ్చి వెనుకటి గ్రంథములన్నిటి నొక్కసారికొనలేనివారు మొట్టమొదలు రు 5-0-0 ల వెలగల గ్రంథములుకొనినజాలును. మిగత గ్రంథములు క్రమేణ తెప్పించుకొనవలయును.

3. ఇదివరకు ప్రచురించినవాటిలో అన్నింటినిగాని కొన్నింటిని గాని కొననివారును, ముందువి మాత్రమే కొనువారును రు 1-0-0 ప్రవేశరుసుము మీయవలెను.

4. పైపేరాలలోని విషయములలో నేది సమ్మతమో తెలియునట్లు దరఖాస్తు ఫారములో నూతనచందాదారులు విశదపరుచవలెను.

S. MURTHY AND CO., MADRAS.